

భగవాన్ శ్రీకృష్ణ జన్మాష్టమి శుభవేళ
భాగ్యనగరం - కె.పి.హెచ్.బి. కాలనీలో
ప్రతి ఇంటిలో శ్రీకృష్ణ జ్యోతి - ఇంటింట 'చైతన్య భగవద్గీత'





చైతన్య భగవద్గీత
ప్రచార మహోద్యమం













గీతామాత సేవలో సంతృప్తి చెందిన భాగ్యనగరం భక్తులు



గురుదేవుల సన్నిధిలో సంతసిస్తున్న దృశ్యం



# చైతన్య ప్రభంజనం

## ఇంటింట చైతన్య భగవద్గీత

సి.పద్మ

***లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు!*** అని పవిత్ర హృదయాలు ప్రతి నిత్యం ప్రార్థిస్తూ ఉంటాయి. ప్రార్థనలు ఫలించాలంటే పరమాత్మ కృపతో పాటు మన కృషి కూడా ఉండాలి. వ్యక్తి బాగుంటేనే సమాజం బాగుంటుంది. వ్యక్తి వికాసం లేనిదే సమాజ అభ్యుదయం సాధ్య పడదు. వ్యక్తి వికాసం ఆంతర్యం నుండే కలుగుతుంది. మనిషి మనస్సులో వికసించిన జ్ఞాన సుమం వల్లనే బాహ్యాభ్యంతరాలలో శాంతి సౌరభం గుబాళిస్తుంది. ఇదే జ్ఞాన వైభవం. చైతన్య భగవద్గీత అందించిన మనః ప్రసాదం.

చైతన్య భగవద్గీత చదివిన ప్రతి ఒక్కరు హృదయంతో స్పందిస్తూ ఉన్నారు. గ్రంథం అందించిన జ్ఞాన వెలుగులో రమిస్తూ ఉన్నారు. ఉత్తరాలలో, ఫోనులలో, దర్శనాల వేళల్లో పూజ్య స్వామీజీతో ప్రత్యక్షంగా, పరోక్షంగా గీతను గురించే పరవశించి పలుకుతున్నారు. చైతన్య గీతా వైభవాన్ని నోరార కీర్తిస్తున్నారు. మళ్ళీ మళ్ళీ చదువుతున్నారు. అందరూ చదవాలని ఆశిస్తున్నారు. అందరి చేత చదివించాలని ఉత్సాహ పడుతున్నారు. పెళ్ళిళ్ళకు వెళితే నవ వధూవరులకు జీవితం నిత్య కళ్యాణం పచ్చతోరణం కావాలంటూ చైతన్య భగవద్గీతనే ఆశీర్వాదంగా అందిస్తున్నారు. నూతన గృహప్రవేశాలకు వెళితే మీ గృహం గుడి కావాలంటూ చైతన్య భగవద్గీతనే కానుకగా ఇస్తున్నారు. మాటలు ఓదార్చలేని చోట జ్ఞానమే నీకు తోడు అంటూ చైతన్య భగవద్గీతా గ్రంథాన్ని చేతులలో ఉంచుతున్నారు. శుభాశుభాలలో, సుఖ దుఃఖాలలో చైతన్య భగవద్గీతే సర్వులకు అండ దండ, శ్రీరామరక్ష అని మనసారా స్తుతిస్తున్నారు. చైతన్య గీతా జ్ఞానం వల్ల తృప్తి చెందిన వారందరూ ఇతరులకు తృప్తిని అందించాలని ఇలా వీచీతరంగ న్యాయంగా ప్రయత్నిస్తూ ఉంటే, ఇదే ప్రయత్నాన్ని ఇంకా విస్తారంగా, వైభవంగా అధిక స్థాయిలో చేపట్టాలనే ఉద్దేశంతో, ఆశ్రమం నుండే కదలి వెళ్ళి నగరంలో వివిధ ప్రాంతాలలో ఉన్న వారికి ఈ గ్రంథాన్ని ఇంటింటికి తీసుకెళ్ళి అందించాలని జంటనగర సత్సంగ సభ్యులు, చైతన్య మాతృమండలి మరియు చైతన్య యువత సంకల్పించి, అందుకు పూజ్య గురుదేవుల అంగీకారాన్ని, ఆశీర్వచనాలను పొంది ప్రథమంగా ఈ కార్యక్రమాన్ని శ్రీకృష్ణ జన్మాష్టమి శుభవేళ ఆశ్రమానికి సమీపంలో ఉన్న కె.పి.హెచ్.బి. కాలనీలో ప్రారంభించారు.

కార్యక్రమానికి సుమారు మూడు రోజులు ముందుగానే చైతన్య యువత ఈ కార్యక్రమం యొక్క ఉద్దేశాన్ని, పూజ్య గురుదేవుల నలభై సంవత్సరాల ఉద్యమాన్ని, వాటికి సంబంధించిన రంగురంగుల దృశ్యాలను కలిగిన అందమైన కరపత్రాలను కాలనీలో ఉన్న

సుమారు 5000 ఇండ్లలో పంచి వచ్చారు. కార్యక్రమానికి ముందు రోజు, అనగా 31 వ తేది సాయంత్రమే ఇందులో పాల్గొంటున్న సభ్యు లందరూ శ్రీ స్వామీజీ సదనంలో సమావేశ మయ్యారు. రెండు వందలకు పైగా ఉన్న సభ్యులను పూజ్య స్వామీజీ (1) కేశవ (2) నారాయణ (3) మాధవ (4) గోవింద (5) విష్ణు (6) మధుసూదన (7) త్రివిక్రమ (8) వామన (9) శ్రీధర (10) హృషీకేశ (11) పద్మనాభ (12) దామోదర (13) సంకర్షణ (14) వాసుదేవ (15) ప్రద్యుమ్న (16) అనిరుద్ధ (17) పురుషోత్తమ (18) అధోక్షజ (19) నారసింహ (20) అచ్యుత (21) జనార్దన (22) ఉపేంద్ర (23) హరి (24) శ్రీకృష్ణ అనే కేశవ నామాలతో ఇరవై నాలుగు టీములుగా విభజించి నలభైకి పైగా బయలుదేరనున్న వాహనాలకు కాషాయ రంగు జెండాలను, అందరూ తమ తమ యూనిఫారములపై అలంకరించుకునేందుకు అందమైన బ్యాడ్జీలను ఇచ్చారు.

మరునాడు ఉదయం, అంటే సెప్టెంబరు ఒకటవ తేది ఉదయం శ్రీకృష్ణ జన్మాష్టమి పర్వదినాన 6.30 గంటలకు సభ్యు లందరికి గురుదేవులు తమ మందిరంలో దర్శన మొసంగారు. అందరి పైన అక్షింతలు చల్లి ఆశీర్వదిస్తూ ఇలా పలికారు :

“ఉదయించే సూర్యుణ్ణి చూచి పక్షులు స్ఫూర్తిని పొంది ఆకాశంలో ఆనందంగా విహరిస్తాయి. రోజూ సూర్యోదయమైతే, సంవత్సరానికి ఒకసారి కృష్ణోదయం. అదే శ్రీకృష్ణ అవతార వైభవాన్ని గుర్తు చేసే జన్మాష్టమి. ఉదయించే సూర్యుణ్ణి చూచి పక్షులు స్ఫూర్తిని పొందినట్లు, ఈ జన్మాష్టమి పర్వదినాన శ్రీకృష్ణుడు అందించిన జ్ఞాన వెలుగుతో స్ఫూర్తిని పొంది, దానిని ఇతరులకు పంచేందుకు సమాజం లోకి మీరందరూ వెళుతూ ఉన్నారు. గోవర్ధన గిరి నెత్తి శ్రీకృష్ణుడు ఆనాడు గోపులకు, గోవులకు, గోవత్సములకు రక్షణ నిచ్చాడు. కృష్ణుని మాటను, కృష్ణుని బాటను ఊతగా గొని నేటికీ 'గిరిధారి' సమాజానికి రక్షణను ఇస్తూ ఉంది. ఏదీ ఇవ్వలేని, ఎవరూ ఇవ్వలేని ఓదార్పును జ్ఞానం ఇస్తుంది.

తల్లి స్తన్యంతో దేహాలు పెరిగాయి. తల్లి ఇచ్చిన శరీరాలు, ఆమె ఇచ్చిన స్తన్యంతో పెరిగి ఈ రోజు విలువలను కాల రాస్తున్నాయి. విధ్వంసాలను సృష్టిస్తున్నాయి. కుటుంబాలను ఛిన్నాభిన్నం చేస్తున్నాయి. భార్య ఎవరో తెలియడం లేదు. భర్త ఎవరో తెలియడం లేదు. బిడ్డ లెవరో తెలియడం లేదు. అసలు బంధుత్వాలే అర్థం కావడం లేదు. చైతన్య భగవద్గీతను పూర్తిగా చదవగలిగిన నాడు సమాజంలో భర్త భర్తగా ఉంటాడు. భార్య భార్యగా ఉంటుంది. కొడుకు కొడుకుగా ఉంటాడు. కోడలు కోడలుగా ఉంటుంది. మామ మామగా ఉంటాడు. అత్త అత్తగా ఉంటుంది. గీతామాత ఇచ్చే క్షీరాన్ని పానం చేసి ఎవరికి వారు బుద్ధిని శుద్ధి చేసుకోవాలి. అందుకు మీరందరూ సిద్ధ పడ్డారు. ఇక ఇప్పుడు అందరికీ గీతా క్షీరాన్ని అందించే కార్యాన్ని మీరు చేపట్టారు. నిర్వీర్యమైన సమాజానికి కొత్త బలం చేకూర్చి మళ్ళీ తేజోవంతం చేయండి. ప్రతి మనసులో పరివర్తన రావాలి. అంటే కృష్ణ ప్రేమ ప్రతి హృదయంలో నిండాలి. కృష్ణుని ఆలోచనలు మనసులో మెదలాలి. కృష్ణనామం నాలుకపై నిలవాలి. కృష్ణ



కార్యం చేతులలో కదలాలి. గొల్లలను సంఘటితం చేసి శ్రీకృష్ణుడు, వానరులను ఒకటి చేసి శ్రీరాముడు లోక కళ్యాణాన్ని ఆవిష్కరించారు. పరమాత్మకు సంబంధించిన ఈ అద్భుత కార్యానికి మీరు కూడా నేడు ఇక్కడ శ్రీకారం చుడుతున్నారు. ఎవరు సహకరించినా, తిరస్కరించినా ప్రసన్నంగా తిరిగి రండి. రాయబార మేగిన శ్రీకృష్ణుడు తిరస్కార, నమస్కారాలను సమంగా స్వీకరించాడు. నలభై సంవత్సరాల క్రితం జనం లేని వాడిగా, ధనం లేని వాడిగా ఆయన బాట లోనే నడిచిన నేను కూడా ధైర్యంగా ముందుకు నడిచానే గాని జనం తిరస్కరిస్తున్నారా నమస్కరిస్తున్నారా అని ఎన్నడూ తిరిగి చూడలేదు. సేవ చేయా లనుకున్నప్పుడు మానావమానాలకు, జయాపజయాలకు సాధకుడు జంక కూడదు.

మీకు ఏవేవి కావాలో అవన్నీ ఇచ్చే శక్తి నాకు లేదు. కానీ, అనుకున్నవి జరిగినా జరగక పోయినా, ఏవి వచ్చినా రాకపోయినా, ఎవరు ఉన్నా లేకపోయినా తృప్తిగా ఉండే శక్తిని ఇచ్చే పారమార్థిక సత్యాన్ని ఈ బ్యాగులో ఉంచి, జిప్ వేసి మీకు అందిస్తున్నాను.

ఏ కాలంలో అయినా, ఏ దేశంలో అయినా సమస్య లేకుండా ఎవరూ లేరు. అన్ని కాలాలకు, అన్ని దేశాలకు, అందరు వ్యక్తులకు సంబంధించిన అజ్ఞాన మనే సమస్యకు ఏకైక పరిష్కారమే జగన్నాథుడు అందించిన ఈ చైతన్య భగవద్గీత. దారిలో పడి ఉన్న మణిని చూడకుండా ఎందరో దాటేయ వచ్చు. అదృష్ట మున్న వాడే దానిని వంగి తీసుకుంటాడు. ధనమున్న వారందరూ చైతన్య భగవద్గీతా గ్రంథాన్ని పొందలేరు. పుణ్య మున్నవారే అందుకుంటారు. అలా భావ దారిద్ర్యానికి దూర మవుతారు. నిజానికి ఇది బ్యాగు కాదు; భాగ్యం. అగ్నికి దగ్గరగా ఉన్న వారికే వేడి అందినట్లు, నీళ్ళల్లో దిగిన వారికే చల్లదనం తగిలినట్లు, గీతను సమీపించిన వారికే రాత మారుతుంది.

సంస్కారవంతుల్ని ప్రభావితం చేసిన సుందర చైతన్య ఉద్యమంలో మీరందరూ భాగస్వాములు. కల్పతరువు లాంటి మన ఉద్యమంలో ప్రధాన పాత్రను పోషిస్తున్న హైదరాబాదు నగరానికి ఆధ్యాత్మిక సేవలు విరివిగా అందించాలి అనే ఉద్దేశంతో మీరు ఈ కార్యక్రమం చేపట్టారు. ఇది ఒక పైలట్ ప్రోగ్రాం వంటిది. మీ మార్గం లోనే నడవాలని రాష్ట్రం లోని అన్ని జిల్లాల లోని ప్రధాన కేంద్రాలు ఆసక్తితో, ఉత్సాహంతో ఎదురు చూస్తూ ఉన్నాయి. ప్రతి జిల్లాకి గ్రంథాలు పంపుదాము. మనకు సిబ్బందికి ఏమీ ఇబ్బంది లేదు కనుక ఒక సైన్యంలా మన వారందరూ అజ్ఞానంపై ధ్వజ మెత్తి జిల్లా నలుమూలలా విస్తృతంగా పర్యటించి, ఇంటింట కృష్ణ జ్యోతిని, చైతన్య భగవద్గీతా మాతను ప్రతిష్ఠితం చేసేందుకు నడుం బిగిస్తారు. అప్పుడే రెండవ ముద్రణ పూర్తి అయి మరో ఐదు వేల కాపీలు బ్యాగులతో సహా సిద్ధ మయ్యాయి. చేసుకున్న వారికి చేసుకున్నంత పుణ్యాన్ని మూటగట్టి ఇచ్చేందుకు గీతా మాత హృదయం పరవళ్ళు త్రొక్కుతోంది” అంటూ స్ఫూర్తి నిస్తూ, మార్గ నిర్దేశం చేస్తూ, ఆశీర్వదిస్తూ పూజ్య గురుదేవులు తమ సందేశాన్ని సమాప్తం చేశారు.

అల్పాహారాన్ని స్వీకరించి, దారి బత్తెంగా ఇంకా కొంత వెంట తీసుకొని సభ్యు లందరూ వాహనాలలో ఆసీనులు కాగా, మందిరం ముందు నుండి బారులు తీరి సాగిన వాహనాలను మందిర ప్రాంగణంలో ఆసీనులై గురుదేవులు ఆశీర్వదిస్తూ కనిపించారు. అది ఒక మరువలేని మరపురాని దృశ్యం, కాదు సన్నివేశం. ఒక్కొక్కసారి తప్పనిసరి అయి బిడ్డలను ఇంటి వద్ద వదిలి తల్లి బయటకు వెళుతుంది. అక్కడ పనులు చక్కబెట్టుకుంటున్నా, బిడ్డల గురించే ఆలోచిస్తూ ఉంటుంది. ఆ తరువాత కొంత కాలానికి ఆ తల్లే బిడ్డలను బడికి పంపి తాను ఇంటి వద్దే ఉండి వారి రాకకై ఎదురు చూస్తూ ఉంటుంది. బిడ్డలకు తాను దూరమైనా, తనకు బిడ్డలు దూరమైనా తల్లీబిడ్డల ఎడబాటులో ఉన్నదంతా ప్రేమే నేమో!

ఆశ్రమ వ్యానులలో, సొంత కార్లలలో, స్కూటర్లు, మోటరు సైకిళ్ళపై బయలు దేరిన సభ్యులు కుక్కట్‌పల్లి హౌసింగ్ బోర్డు కాలని (కె.పి.హెచ్.బి. కాలని) చేరి అక్కడ భువన విజయం అనే పెద్ద మైదానంలో వాహనాలన్నీ నిలుపుకొని కాలనీలో ఉన్న ఇండ్లకు చకచకా వెళ్ళి కోరిన వారికి గ్రంథాలను విక్రయించారు. అడిగిన వారికి గ్రంథ విషయాన్ని వివరించారు. సందేహాలను నివారించారు. సంశయాలను దూరం చేశారు. తాము నడుస్తున్న బాట లోని జ్ఞాన ఊటను గూర్చి వివరించారు. గీతా ప్రాశస్త్యాన్ని, ఆచార్యుని ప్రాభవాన్ని, జ్ఞాన వైభవాన్ని, ఆశ్రమ వైశిష్ట్యాన్ని, ఆశ్రమానికి వెళ్ళే దారిని, 'గిరిధారి' వల్ల కలిగే లాభాల్ని, నగరంలో యజ్ఞాలను, ఆశ్రమం లోని కార్యక్రమాల్ని అన్నీ వివరించి, విశద పరచి సాయంత్రం నాలుగు గంటలకు జైత్ర యాత్ర నుండి తిరిగి వచ్చిన మహా యోధులలా ఆశ్రమం లోకి ప్రవేశించారు.

వారి రాక కోసమే ఎదురు చూస్తున్న గురుదేవులు వెంటనే శ్రుతిమందిరంలో అద్భుతమైన కృష్ణాష్టమి వేడుకను ఆరంభించారు. సంకీర్తనతో ప్రవచనంతో సర్వులను అలరించారు. కార్యక్రమానంతరం సభ్యు లందరూ గురుదేవుల మందిర ప్రాంగణంలో సమావేశమై, ఆనాటి ముచ్చట్లను చెప్పుకున్నారు. ముమ్ముందు ఇటువంటి కార్యక్రమాలలో చేయవలసిన సవరణలను తీసుకోవలసిన జాగ్రత్తలను గురుదేవుల నుండి శ్రద్ధగా విన్నారు. గురుదేవులతో కలిసి ఆనందంగా భిక్షను స్వీకరించారు. అందరూ కలిసి గురుదేవులతో ఫోటో దిగారు. వాహనాలలో కొందరు ఇండ్లకు తరలి పోగా, మరి కొందరు ఆ రాత్రికి ఆశ్రమం లోనే విశ్రమించారు.

## బ్రహ్మసూత్ర బోధ సంపూర్ణం

చతుస్సూత్రిలో చివరి దైన 'సమన్వయాధికరణమ్'పై శ్రీ శంకర భాష్య వివరణమును పూజ్య గురుదేవులు గురువారం సెప్టెంబరు 9 వ తేది సమాప్తి చేశారు. నాలుగు వర్షకాలు



కలిగిన ఈ సూత్ర భాష్యంపై గురుదేవుల ప్రవచనాలు 28 డి.వి.డి.లలో నిండి భక్తులకు అందించ బడ్డాయి.

అద్భుతంగా సాగిన బోధకు సంతృప్తి చెందుతూ, శ్రోతల జ్ఞానాసక్తికి, ఏకాగ్రతకు, శ్రద్ధకు ప్రతిస్పందిస్తూ చతుస్సూత్రిని పరిసమాప్తి చేస్తున్న మంగళవేళ దయార్ద్ర హృదయంతో గురుదేవులు ఇలా పలికారు :

*"ఆత్మబంధువులారా! జీవితంలో ఈ అద్భుతమైన భాష్య గ్రంథాన్ని చెప్పే అవకాశం ఉంటుందని, వినే శ్రోతలు లభ్యమవుతారని నేను ఊహించలేదు. ఎంతో శ్రమపడి మీరు అర్థం చేసుకున్నారు. అంతకన్నా ఎక్కువ శ్రమపడి నేను బోధించాను. నాకు తెలిసిన విషయ మైనా మీకు తెలిసేటట్లు బోధించడానికి నేను ఎంతగానో శ్రమించవలసి వచ్చింది. ఒక విధంగా చూస్తే మీరు చాలా అదృష్టవంతులు. బోధించే గురువు చెంత ఆసీనులై విన్నారు. కానీ నాకా అదృష్టం లేకపోయింది. నలభై సంవత్సరాలు వెనుదిరిగి చూసుకుంటే నా సాధనా దశ ఒక పూడిక లేని అగాధంలా దర్శన మిస్తుంది. ఎవరెవరిని అడిగానో! ఎన్ని దిక్కులు తిరిగానో! ఎంత కష్ట పడితే గ్రంథాలను పొంద గలిగానో! దొరికిన వాటిని చదివి అర్థం చేసుకునేందుకు రాత్రింబవళ్ళు ఎంత శ్రమించానో! సందేహాలతో ఎంత సతమత మయ్యానో! ఎంత విలపించానో! నాకూ, నా కృష్ణుడికి తప్ప మరెవ్వరికీ తెలియదు. అంత కష్టపడి సాధించాను కనుకనే ఇంత విలువైన జ్ఞానాన్ని మీ హృదయాలలో నిక్షిప్తం చేసేందుకు మళ్ళీ ఇంతగా శ్రమించ వలసి వచ్చింది. ఎట్టకేలకు నా ఊహలు ఫలించి నందుకు, శ్రమలు సార్థక మైనందుకు నేను ఎంతగానో తృప్తి చెందుతూ ఉన్నాను.*

*ఏయే తీరులలో అర్థం చేసుకున్నానో తెలుసు గనుకనే మీరెక్కడ దారి తప్పినా, ఏకాగ్రతను కోల్పోయినా, చిటికెలో మిమ్మల్ని తిరిగి రప్పించి అరటిపండు ఒలిచి తినిపించి నట్లుగా విషయాన్ని వినిపించాను. ఇక్కడ విషయ ప్రాధాన్యం, వక్త ప్రాధాన్యమే గాని శ్రోత ప్రాధాన్యం లేదు. భాష్యాన్ని ఇచ్చిన వారు ఆచార్యులు. ఆచార్యుల భాష్యం నాకు స్ఫటికంలా స్వచ్ఛంగా అర్థమై ఉండటం వల్లనే విస్పష్టంగా మీకు దానిని అందించ గలిగాను. మీ ప్రాధాన్యమల్లా నిష్ఠగా కూర్చుని శ్రద్ధగా వినడమే. అది మీరు చక్కగా చేశారు – నాకు ఎంతో సంతోషంగా ఉంది.*

*నా నలభై సంవత్సరాల సేవా జీవనంలో నాకు తెలిసినంత వరకు బ్రహ్మసూత్ర భాష్య విచారణ ఈ విధంగా ఎక్కడ జరిగిందో నాకు తెలియదు. 'శ్రుతిమందిరం' అని పేరు పెట్టుకున్నందుకు ఇక్కడే జరిగింది. కైవల్య ధామం' అని పిలుచుకున్నందుకు మోక్షద్వారాలు ఇక్కడే తెరుచు కున్నాయి. వందలాది గంటలు ఈ శ్రుతి మందిరంలో ప్రవచించడం జరిగింది.*

నా మాటలు ఎప్పటికి ఇక్కడ ప్రతిధ్వనిస్తూనే ఉంటాయి. ఇక మిగిలింది ఆ స్వరూపంలో ఉండిపోయే ప్రయత్నమే. జన్మాంతర సంస్కారాలు ప్రతిబంధకాలు కాకుండా, జపం, ధ్యానం విడువక చేయండి. విన్నంత మాత్రాన సత్యం అనుభూతికి అందదు. విన్నది అర్థం కావడానికి కూడా మీరు ఇంత కాలం చేసిన భక్తే కారణం.

శ్రుతిమందిరంలో బోధించినంత తృప్తిగా యజ్ఞాలలో బోధించడం కుదరదు. అక్కడ భిన్న ప్రవృత్తులు, విభిన్నమైన అభిరుచులు కలిగిన జనం వేల సంఖ్యలో ఉంటారు. ఇది చూస్తే సాధన చతుష్టయ సంపద కలిగిన జిజ్ఞాసువులకు, తీవ్ర ముముక్షువులకు మాత్రమే బోధించ వలసిన గ్రంథం.

ఈ రోజు నుండి సంప్రదాయం అర్థమైన మీరు సంప్రదాయ గాడి లోనే జీవించ డానికి ప్రయత్నించండి.

ఇది వ్యాస పీఠం. ఇక్కడ నుండి మీకు ఇస్తున్న ఆదేశ మిది. నేటి నుండి జ్ఞానం తప్ప రెండవ విషయాన్ని ఆలోచించకండి, ఆలపించకండి. బయట ప్రపంచంలో మీరు చర్చించే దంతా గౌణాత్మ విషయం, మిథ్యాత్మ విషయమే గాని సత్యాత్మ విషయం కాదు. మీరు సంప్రదాయ విలువ తెలిసిన వారు కనుక సంప్రదాయ రక్షణ చెయ్యండి.

మీ శ్రవణ నిష్ఠకు నే నెంతగానో పొంగిపోతూ ఉన్నాను. ఇంతవరకూ చేసిన ప్రాపంచిక చర్చలతో చెవులకు పట్టిన త్రుప్పు ఆచార్యుల భాష్య శ్రవణంతో వదిలి పోయింది. మళ్లీ వెను తిరగకండి. సత్యాత్మనే సదా విచారిస్తూ తదేక చింతనతో ఆత్మనే సర్వత్ర దర్శించండి. ఈ బ్రహ్మసూత్ర భాష్య వివరణలో మీరు చూపిన శ్రద్ధకు సంతృప్తి చెందాను. ఎంతో శుభకరంగా, పవిత్రంగా, మంగళకరంగా బోధలు ముగిశాయి. కనుక సంప్రదాయ రక్షణలో భాగంగా, ఇప్పుడు ఇక్కడ ఒక కార్యక్రమం ఉంటుంది. అదేమిటో మీ అందరికి అయిదు నిమిషాల లోనే తెలిసి పోతుంది" అంటూ వేదిక దిగేశారు.

అయిదు నిమిషాలలో శ్రుతి మందిరం మిషనుతో శుభ్రం చేయబడి, చకచకా అరటి ఆకులు వరుసగా వేయబడి పంక్తి భోజనాలు సిద్ధం చేయబడ్డాయి. అందరూ పంక్తులలో కూర్చుగానే పూజ్య స్వామీజీ ఒక్కొక్కరినే పలుకరిస్తూ, నవ్విస్తూ, పరామర్శిస్తూ రవ్వలడ్డూ ప్రసాదాన్ని వితరణ చేస్తూ పంక్తుల మధ్య తిరిగారు. ఆశ్రమవాసులు, కార్యకర్తలు వేడి వేడిగా భోజనాలు వడ్డించారు. అందరూ మంత్రం చెప్పి ఆరగిస్తుండగా పూజ్య స్వామీజీ పునః వేదిక నెక్కి చక్కటి భజనలు ఆలపించారు. చైతన్య యువత గురుదేవులను అనుసరించి పాడారు. భజనలతో, భోజనాలతో మంగళకరమైన ఈ దృశ్యాన్ని కెమెరాలలో బంధించారు. పాఠకులు దర్శించేందుకు ఆ వర్ణ చిత్రాలను 'గిరిధారి'లో ప్రచురిస్తున్నాము.



# స్వామీజీ కార్యక్రమము



9-10-2010
శనివారం సాయంత్రం
6.30 గంటలకు

## గోదావరిఖని

కోదండ రామాలయ ప్రాంగణములో పూజ్య స్వామీజీ ప్రవచనము

10-10-2010 . . . ఉదయం 6.30 ని॥లకు
శ్రీమురళీకృష్ణ మందిరము - సుందర సత్సంగ భవనమునకు
పూజ్య స్వామీజీ కరకమలములచే భూమి పూజ

## 208 వ గీతా జ్ఞాన యజ్ఞము

## విశాఖపట్టణం

ఆళ్వార్‌దాస్ స్టేడియం గ్రౌండ్స్‌లో (ఎమ్.వి.పి. కాలని)
24-10-2010 నుండి 31-10-2010 వరకు
పూజ్య గురుదేవులు, జ్ఞానబ్రహ్మ
శ్రీశ్రీశ్రీ స్వామి సుందర చైతన్యానందుల వారిచే

## అమృతోపన్యాసములు

ప్రతి రోజు సాయంత్రం 6.30 నుండి 8.00 గంటల వరకు
భగవద్గీత - 15వ అధ్యాయము పురుషోత్తమ ప్రాప్తి యోగము
ప్రతి రోజు ఉదయం 6.30 నుండి 7.30 గంటల వరకు
శ్రీ విద్యారణ్యస్వామి విరచితం
వేదాంత పంచదశి - మహావాక్య విచార ప్రకరణము

ప్రారంభసభ:-
24-10-2010 ఆదివారం సాయంత్రం 6.30 గంటలకు

## మహబూబ్ నగర్ లో శ్రీకృష్ణాష్టమి సంబరాలు







ఆలయంలో అభిషేకకార్యక్రమంలో
జిల్లా ఎస్.పి. శ్రీ సుధీర్ బాబు దంపతులు



భగవాన్ శ్రీ మురళీకృష్ణ స్వామి